భగవద్గీత

# విభూతియోగసారం

ఉపదేశకులు :

శ్రీ శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతీ స్వాముల వారు




ప్రకాశకులు :

**యం. హనుమంతరావు**

అధ్యక్షులు

అధ్యాత్మ ప్రచార సేవా సమితి

3/337, సదాశివ పేట,

ఆదోని – 518 301.

॥ ఓం ॥

# భగవద్గీత

## విభూతియోగసారం

విభూతి అనగా భగవంతుని మహిమ వ్యక్తమయ్యే ఒక కేంద్రం. భగవంతుని విభూతుల్లో దేన్ని పరిశీలించినా, మనకు మొదట ఆనందమౌతుంది. తాపం పరిహారమౌతుంది. తర్వాత అందులో పరమాత్ముని మహిమ ప్రకటమౌతుంది. అర్జునుని నిమిత్తంగా చేసుకొని భగవంతుడు అందరూ ఉద్ధారం కావాలనే ఉద్దేశ్యముతో ఈ విభూతుల్ని ఉపదేశించాడు. పరమాత్ముని విభూతుల ఉపాసన వల్ల పరమాత్మ జ్ఞానమే ప్రాప్తమవుతోంది.

### 1. ఇంద్రియాణా మనశ్చాస్మి

ఇంద్రియాల్లో మనస్సు నేను. మనస్సనేది మనిషిని తన ఇష్టానుసారంలాక్కొనిపోతుంది. కామం, క్రోధం, లోభం, మోహం – మున్నగు రూపాల్ని ధరించి మానవుని చేయరాని కార్యాలన్నీ అతనితో చేయిస్తుంది. ఇది మనస్సు యొక్క మాయారూపం, దీన్ని దైవవిభూతి అనే దానికంటే దయ్యం విభూతి అనేదే సమంజసం. అయితే "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అన్నట్లు మనస్సే మానవుని బంధమోక్షాలకు కారణమౌతుంది. మోక్షానికి కారణమైన శుద్ధసాత్త్విక మనస్సనేది మనకు భగవంతుడు అనుగ్రహించిన ఒక గొప్ప వరం. మానవుని యందుండు అతి గొప్పవస్తువు మనస్సే. మనస్సును సరైన తీరిలో ఉపయోగించని వారు కొందరుంటారు. అయితే అదే మనస్సును ఉపయోగించి "నేను నిత్యశుద్ధ బుద్ధ ముక్తుడయిన ఆత్మను" అనే దివ్యజ్ఞానాన్ని ఇపుడే ఇచటనే సంపాదించుకొనడానికి మనస్సే మనకు సాధనం. బయట సాధనా లేవీ లేకనే విరక్తులైన మహనీయులు సదా ఆనందంతో ఉంటారు కదా? వీరికి

ఆ శాశ్వతానందం ఎలా లభించింది? అయితే ఈ ఆనందరూపమైన బ్రహ్మమును తెలియటానికి సాధనమైన మనస్సు యొక్క సామర్థ్యమెట్టిదో గ్రహించండి! అందువల్ల మనస్సు భగవద్విభూతి అని ఇచట చెప్పబడింది.

2. యజ్ఞానాం జపయజ్ఞో స్మి

దేవతలను పూజించడం, దేవతలనుద్దేశించి వస్తువునందలి 'నాది' అనే అభిమానాన్ని వీడుటయే యజ్ఞం. నిజం చెప్పాలంటే జగత్తంతయూ దేవతలదే. మనం అది నాదనే అభిమానం విడిస్తే యజ్ఞమౌతుంది. ఇక దేవదేవుడయిన పరమాత్మునిదే అంతా అని తెలుసుకుంటె ఎలాంటి యజ్ఞమౌతుందనేది గీతలో చెప్పబడింది. యజ్ఞ శబ్దానికర్థం పరమాత్మడే, యజ్ఞస్థలం అనేది పరమాత్మ తాండవమాడే రంగం పరమాత్మ సేవ చేయుటకై యజమాని దీక్షవహించి సంకల్పం చేస్తాడు. యజ్ఞానికి పిలువకున్ననూ అందరూ పాల్గొని యజ్ఞేశ్వరుని దర్శించి కృతకృత్యులు కావాలనే స్మృతి చెబుతోంది. అలాంటి శ్రేష్ఠమైనదే యజ్ఞం!

అయితే యజ్ఞాన్ని నిర్విఘ్నంగా నెరవేర్చడం మిక్కిలి కష్టమే. ధన సహాయం లేనిదే ఇది సాధ్యం కాదు. యోగ్యులైన వారి నుండి ధనాన్ని సంగ్రహించడం కూడా కష్టమే. ఇంతేకాక, యజ్ఞాలు ఎంత పవిత్రంగా ఆచరించినా పశుహింస ఇత్యాదులు అనివార్యం కదా? అయితే జపయజ్ఞం పదిరెట్లు శ్రేష్ఠమని స్మృతి చెప్పింది. అందువల్ల భగవంతుడు "యజ్ఞాల్లో జపయజ్ఞం"నేనని కంఠోక్తంగా చెప్పాడు.

జపమనగానేమి? "తజ్జపదర్థ భావనమ్" మంత్రాన్ని జపించడమంటే మంత్రార్థాన్ని భావించడం. పరమాత్మణ్ణి వేదమంత్రాలతోభావించడం. అతని నామస్మరణ చేయడం అనేదే జపం. అయితే సామాన్యంగా మనం సంతానం, ఐశ్వర్యం, అధికారం – ఇత్యాదులనే కోరుకుంటాము. అందువల్ల మనకు

కష్టాలువచ్చినపుడే పరమాత్మణ్ణి ఆశ్రయిస్తాం. అయితే ఇవన్నీ ఎన్నో సందర్భాల్లో ఉపయోగపడవు. మమ్మల్ని కాపాడజాలవు. మనల్ని తాపత్రయానికిగురిచేస్తాయి. అయితే పరమాత్ముని నామజపం ఇలాంటిది కాదు. మహర్షులు దీని తత్వాన్ని కనుగొన్నారు. ఒక్క క్షణం వాసుదేవుణ్ణి విస్మరిస్తే గొప్ప హానియే మనకు సంభవిస్తుంది. "పరమాత్మా, నీ బలమే నాకు నిజమైన బలం, నీవే నన్ను సదాకాపాడు"మని వేడుకోవాలి. అతని నామాన్ని సదా స్మరించే వానికి ఎల్లప్పుడూ భగవంతుడు రక్షించటానికి సిద్ధమైఉంటాడు.

ఇంకో రహస్యం. భగవంతుడు "నేనే జపయజ్ఞం" అన్నాడు. జపమే పరమాత్ముని స్వరూపమని భావించుకోవాలి. విజ్ఞులు వేదాన్ని 'భగవాన్ ఆమ్నాయః' అని చెప్పినారు. పరమాత్మ వేదవేద్యుడు కాదు. వేదమే భగవత్స్వరూపం. అందువల్ల మంత్రం, భగవన్నామం - సర్వమూ పరమాత్మయే అని మనం తెలుసుకోవాలి. భక్తిశ్రద్ధలతో నామ జపం చేయువారికి భగవంతుడు నామం యొక్క రూపంతో ప్రకటమవుతాడు. మననాలుక పరమాత్మ అభివ్యక్తమయ్యే స్థలం. అది కలుషితమై ఉండకూడదు. అచట చెడుమాటలు వ్యక్తం కాకూడదు. స్త్రీ, ధనం, నాస్తికుల విచారపరమైన మాటలు అచట తోచుకోరాదు. ఇలాంటి పవిత్రమైన భావన ఉండాలి. జపంలో సంఖ్య ముఖ్యం కాదు. భగవంతుడే మన హృదయంలో ఉన్నాడు. అతడే నామం యొక్క స్వరూపంతో నా నాలుకపై నాట్యమాడుచున్నాడనే భావన ఉండాలి. నామమే భగవత్స్వరూపమనే భావనతో జపించడమే యజ్ఞం. ఇదే భగవంతుని పూజ. ఈ యజ్ఞం సర్వయజ్ఞాల్లో శ్రేష్ఠం. ఎందుకంటే ఇందులో అహంకార మమకారాలు సంపూర్ణంగా తొలగివుంటాయి. భగవత్స్వరూప చింతనమే నిత్యనియమం కావాలి.

## 3. అశ్వత్థః సర్వవృక్షాణామ్

మన దేశంలో అశ్వత్థవృక్షాన్ని అతి పవిత్రమని భావిస్తారు. ఇది వేర్లు ప్రసరించుకొనుటయందునూ, పక్షులకు ఆశ్రయమిచ్చుట యందునూ సుప్రసిద్ధమైన చెట్టు. జ్ఞానానికీ అశ్వత్థానికీ ఎలాగో నికట సంబంధం ఉంది. బుద్ధుడు తన భవచక్రాన్ని లేక ద్వాదశ నిదానాలను కనుగొన్నది ఈ చెట్టు క్రిందే. అందువల్ల బౌద్ధులు దీని బోధివృక్షమని పిలుస్తారు. అశ్వత్థవృక్షం సనాతన ధర్మానికి ఒక గొప్ప సంకేతమని ప్రసిద్ధి. సంసారమూ దాని కారణమైన పరబ్రహ్మమూ చేరి అశ్వత్థ వృక్షమని శ్రుతిలో చెప్పబడింది. అశ్వత్థ వృక్షాన్ని నరికివేస్తే మన ధర్మానికి అవమానం చేసినట్లని ఆస్తికులు భావిస్తారు. అశ్వత్థవృక్షాన్ని పూజించడం, దానికి ఉపనయనాదులను చేయించడం - ఒక పుణ్యకార్యమని కొందరి విశ్వాసం. అశ్వత్థవృక్షాన్ని ప్రదక్షిణ చేసి నమస్కరిస్తే త్రిమూర్తుల్ని ప్రదక్షిణ చేసి నమస్కరించినట్లని సనాతన ధర్మం వారి విశ్వాసం. అందువల్ల భగవంతుడు అశ్వత్థవృక్షాన్ని ఒక మహావిభూతి అని ఉపదేశించాడు.

## 4. ప్రహ్లాదశ్చాస్మి దైత్యానం

దైత్యుల్లో ప్రహ్లాదుడు - అనే విభూతిని విచారిద్దాం. దైత్యులనగా సహజంగా హింసా ప్రవృత్తిగలవారనే తెలియాలి. దైత్యులు రజోగుణ ప్రధానులై ఉంటారు. అయితే వారిలో ఎవరూ ఎన్నటికీ సాత్త్వికవృత్తిననుసరింపరని మాత్రం భావించరాదు. సదవకాశం దొరికితే ఇలాంటివారుకూడా సత్పురుషులుగా మారిపోవచ్చు. ఎలాఇటి పాపాత్ములకైననూ సన్మార్గం వైపు తిరగడానికి అవకాశముంది. సత్సంగము వల్ల దైత్యుల వంశములో సకల సద్గుణసంపన్నుడై పుట్టిన మహాత్ముడే ప్రహ్లాదుడు. బాల్యములోనే పాఠశాలలోని పిల్లలకు నారాయణ మంత్రాన్ని ఉపదేశించాడు. పరమాత్మ విద్యనే మొట్టమొదట సంపాదించుకోవాలి.

తర్వాత ఇతర విద్య ఏదైనా నేర్చుకోవచ్చు. పరమాత్మ అందరిలో సమానంగా ఉన్నాడు. సర్వజీవుల్ని సమానంగా చూస్తాడు. భక్తితో భజించే వారందరినీ కాపాడతాడు – అనేదే ప్రహ్లాదుని సద్బోధ. వంశముచే దైత్యుడైననూ గుణముచే దేవత అనిపించుకున్నాడు. బ్రాహ్మణాది వర్ణాల్లోనూ ఇలాగే బ్రాహ్మణ కులంలో జన్మించినాశూద్రగుణాలతో కూడియుంటె అతన్ని శూద్రుడనియే భావించాలి. శూద్రకులంలో పుట్టినా బ్రాహ్మణ గుణములతో కూడియుంటె అతన్ని బ్రాహ్మణుడనియే భావించాలి.

ఇలా భారతంలో ఉంది "అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" – చక్రి సర్వోపగతుండనే తత్త్వానుభూతిని పొందినవాడే ప్రహ్లాదుడు. బ్రహ్మమును తెలిసినవాడు బ్రహ్మయే అని శ్రుతి చెబుతోంది. అందువల్ల శాస్త్రం దృష్టిలో భగవత్స్వరూపుడే అయియున్న ప్రహ్లాదుణ్ణి ఇచట భగవద్విభూతి అనడం సమంజసమే కదా!

5. రామః శస్త్రభృతామహమ్

శస్త్రధారుల్లో రాముడు అనే విభూతిని పరిశీలిద్దాం. శస్త్రాన్ని ఎందుకు ఎపుడు ధరించాలనేది శ్రీరాముని నుండి నేర్చుకోవాలి. దశరథుని వచనం పరిపాలించుటకై అరణ్యానికి పోవలసివచ్చింది. అపుడు ఒక సమయంలో సీతాదేవి ఇలా ప్రశ్నించింది. మనం ఇపుడు సాత్త్వికులైన ఋషిమునుల మధ్య ఉన్నాం కదా, ధనుర్బాణాలెందుకు ? పాపకరమైన హింసాపరమైన శస్త్రాల యొక్క ఉపయోగమేమి? సీతాదేవి అడిగిన ప్రశ్నకు శ్రీరామచంద్రుడు ఇలా ఉత్తరమిచ్చాడు. దశరథుడు రాజ్యభారాన్ని భరతునికి అప్పగించి నన్ను అరణ్యానికి పంపించాడు. రాష్ట్రం కాని, అరణ్యం కాని సమస్తమూ రాజ్యానికి చేరిందే. తన రాజ్యంలో ఎచటనూ అధర్మం తల ఎత్తకుండా చూచుకోవడం రాజు యొక్క కర్తవ్యం మనం రాజు యొక్క ప్రతినిధులం. ఇచట ఋషి

మునులకు రాక్షసులు హింసిస్తున్నారని మనకు వార్తలందినాయి. ఇపుడు వీరి కష్టాల్ని పరిహరించడం మన కర్తవ్యం. అందువల్ల ధనుర్బాణాల్ని ధరించడం సమంజసమనేదే శ్రీరాముని అభిప్రాయం.

శ్రీరాముని కోదండం సత్యధర్మాల రక్షణకు చిహ్నం. శిష్టరక్షణ, దుష్టశిక్షణ సంకల్పంతో అవసరమైనపుడు మాత్రమే శస్త్రాల్ని ఉపయోగించడం శ్రీరాముని సత్యసంకల్పం. ప్రస్తుతం మన వద్ద అలాంటి శస్త్రాలు లేకపోవచ్చు. అయితే గుప్తమైన కొన్ని శస్త్రాలున్నాయి. వాగ్రూపమైన శస్త్రంతో మనం అనేకులను హింసించవచ్చు. లేఖనమనేది కత్తికంటె ప్రబలమైన అస్త్రం. నింద, మూకర్జి, మోసం – ఇత్యాదులు లేఖన వల్ల కలిగే హింసలు. మన ఆలోచనలు ఒక విధమైన శస్త్రాలే. అవి అదృశ్యంగానే ఉండి జనులపై పరిణామం కలుగజేస్తాయి. మనం పలికే మాటలు, చేయు కార్యములు, చేయు ఆలోచనలు –మన అధీనంలో ఉండాలి. శ్రీరామునిలా విడిచిన బాణాన్ని వెనుకలాగే సామర్థ్యం ఉండాలి. ఇలా “రామః శస్త్రభృతామ్” అనే వాక్యంలే సదభిప్రాయం ఇమిడి ఉంది.

## 6. అధ్యాత్మ విద్యా విద్యానాం

“విద్యల్లో అధ్యాత్మ విద్య నేను” – అనే విభూతిని విచారిద్దాం. విద్య అనగా జ్ఞానం. అజ్ఞానాన్ని తొలగించునదియే విద్య. లోకంలోని వేరే వేరే విద్యలు ఆ యా విషయకమైన అజ్ఞానాన్ని మాత్రం తొలగిస్తాయి. అధ్యాత్మ విద్యయో ‘అజ్ఞానం యొక్క మూలాన్నే తొలగిస్తోంది’. ఏ ‘ఒక్కటి’ని తెలుసుకంటే సర్వమూ తెలిసినట్లగునో దాన్ని తెలియచేయునదే అధ్యాత్మ విద్య. ఇంకో విశేషం. ఇతర విద్యల్ని జనులు ఒకరినొకరు మోసం చేయుటకుపయోగిస్తారు. ఇలా ఎన్నో సందర్భాల్లో దుర్వినియోగపరచడం మనందరి అనుబవంలో ఉంది. అయితే అధ్యాత్మ విద్యలో రాగద్వేషాలకు అవకాశం లేదు. ఈ విద్యనభ్యసించిన వారెవరూ ఎవరినీ మోసం చేయడానికి

వీల్లేదు. తత్త్వవేత్తలు సర్వభూతాల హితం కోసమే పాటుపడతారు.

ఈ బ్రహ్మాండం యొక్క తత్త్వం ఆత్మయే. కుండను మట్టి వ్యాపించియున్నట్లు సర్వమునూ ఏది వ్యాపించియున్నదో అదే ఈ జగత్తు యొక్క ఆత్మ. ఆత్మయే ఈ జగత్తుకు ఉపాదన కారణం. కార్యం కారణం కంటె వేరుగా లేనందు వల్ల కారణాన్ని తెలిసే కార్యం యొక్క తత్త్వాన్ని తెలిసినట్లే. ఈ అర్థంలో ఆత్మను తెలుసుకుంటే సమస్త జగత్తును తెలుసుకున్నట్లే – అనేదే అధ్యాత్మ విద్యావంతుల అభిప్రాయం. ఈ జగత్తు తనకాధారమైన పరమాత్మను వీడి స్వతంత్రంగా ఉండదు. ఆత్మ, బ్రహ్మ, విష్ణు – ఇవన్నీ పర్యాయ శబ్దాలు. "భూతాని విష్ణుర్భువనాని విష్ణుర్వనాని విష్ణు ర్గిరయశ్చ విష్ణుః" అనే పురాణ వచనముంది. ఏకైక మహావిష్ణువునే మనం భూతాలనియూ, భువనాలనియూ, వనాలనియూ కొండగుట్టలనియూ వేరేవేరేగా భావించుకుని వ్యవహరిస్తున్నాం. ఆత్మలేక బ్రహ్మమే ఈ జగత్తు యొక్క సారం. ఈ జగత్తుకు సారమైన ఆత్మను గురించి బోధించే విద్యయే అధ్యాత్మ విద్య.

అధ్యాత్మ విద్య అనేదొక పరమాత్ముని మహావిభూతి. గీత దీన్నే బోధిస్తుంది. సకల విద్యల సారమే ఇది. ఏ విద్య నేర్చుకున్నా కావాలనేది విడిచేది లేదు. అధ్యాత్మ విద్యావంతులకు మాత్రం ఏదీ కావాలనిపించదు. ఏ విద్యయూ నిత్యతృప్తిని పరమశాంతిని ఇవ్వజాలదు. అయితే అధ్యాత్మ విద్యసారమైన పరమాత్మ జ్ఞానాన్ని సంపాదించుకుని నితయతృప్తులై పరమశాంతిని పొందిన మహాత్ములు ఈ లోకంలో వున్నారు. శాంత స్వరూపుడైన పరమాత్మనే విస్మరించిన వారికి సాంతి ఎలా లభిస్తుంది? ఈ సర్వజ్ఞుడూ సర్వశక్తుడూ నిత్య శుద్ధబుద్ధముక్త స్వరూపుడైన పరమాత్మయే ఈ సమస్త జగత్తునకు కారణభూతుడు. సర్వమూ అతని శ్వాసయే. ఆనంద

ఘనుడయిన అతడే మనందరి ఆత్మ. అతడు శ్వాసలా లీలా మాత్రంచే ఈ బ్రహ్మాండమును సృష్టించాడు. సృష్టికర్త యొక్క రహస్యం తెలుసుకుని మనం ఆనందమయ జీవితం గడపాలి. అందువల్ల ఈ అధ్యాత్మ విద్య అందరికీ అత్యావశ్యకం. జనకుని విదేహరాజ్యంలో జనులుష్త్రప బ్రహ్మ విజ్ఞానులై యుండిరి. ప్రజలు బ్రహ్మ విచారమే ప్రధానమని నిశ్చయించి అన్య విచారానికి దూరంగా ఉండిరట. బ్రహ్వాటచారం ప్రథమం, రాజకీయ విచారం మున్నగునవి తదనంతరం అనేది మన హృదయంలో నెలకొనాలి. మన పూర్వీకులు అధ్యాత్మవిద్యకే విలువనిచ్చి బ్రహ్మజ్ఞానం సంపాదించుకుని కృతార్థులైనారు. మనం ఈ అధ్యాత్మ విద్యను అలక్ష్యం చేయరాదు. మనం ఈ సంప్రదాయాన్ని విస్మరింపరాదు. దీన్ని భగవంతుని మహావిభూతి అని భావంచి గౌరవించాలి.

## 7. మృత్యుస్సర్వ హరశ్చాహం

సర్వమునూ అపహరించే మృత్యువు నేను. ధనం, యౌవనం, ఆరోగ్యం, బలం, ఉత్సాహం – ఇత్యాదులను అపహరించే మృత్యువు ఒకడు. ప్రాణాన్నే అపహరించి సమస్తమునూ అపహరించే మృత్యువు –సర్వహర మృత్యువనే ఇంకొకడు. "సర్వహర మృత్యువునేనే" అని భగవంతుడు చెప్పాడు. దీని రహస్యమేమంటే మృత్యువు అంటూనే జనులు భయపడతారు. మరి మృత్యువును ఉపాసించడం ఎలా సాధ్యం. కాళి, నరసింహ ఇత్యాది ఉగ్రరూపంలో ఉండే దేవతల్ని ఉపాసించివారున్నారు. సామాన్యులకు ఈ ఉగ్రరూపాలు భయంకరంగా తోచడం సహజం. అయితే భక్తులకు ఈ రూపాలు భయంకరమైనవి కావు. భగవంతుడు భక్తులకు, పుణ్యవంతులకు సౌమ్యంగా సుందరంగా కనిపిస్తాడు. భక్తి లేని వారికి భయంకరంగా తోస్తాడు అని స్మృతి చెబుతోంది. మరణకాలంలో జనులు మృత్యువుకు భయపడతారు. అయితే నిజంగా విచారిస్తే జగత్తు ఎల్లపుడూ మృత్యువు నోట్లోనే ఉంటుంది.

ఈ జగత్తులో నాశం కాని వస్తువేది? ప్రతి ఒక్క వస్తువూ వికారం పొందుతూనే ఉంటుంది. ఏదో ఒక రోజు నాశమయ్యే తీరుతుంది. మనమంతా భోగరూపమైన మృత్యువు యొక్క కోరల్లో చిక్కుకొని సతమతమౌతున్నాం. ఇంద్రియాలు క్రమంగా క్షీణిస్తుంటాయి. మనం అంతమట్టుకు ప్రతిదినం మృత్యువుకు వశమై ఉంటాం. సర్వహర మృత్యువు ప్రాణాలు లాగేస్తే మన వ్యాపారం అగిపోతుంది. ఇలాంటి మృత్యువునేనని చెప్పాడు భగవంతుడు. దీన్ని విభూతి అనడం ఎలా? అంటే మృత్యువు మనకు అపుడపుడు హెచ్చరిక చేస్తూనే ఉంటాడు. భోగాలకోసం మీరు పుట్టినవారు కారు. ఇంద్రియాల్ని జయించి పరమాత్మ పదవిని పొందడం కోసమే మీరు పుట్టారని అనుభవపూర్వకంగా బోధిస్తూంటాడు. ఈ జన్మ మనం వ్యర్థం చేసుకున్నా ఇంకో జన్మలోనైనా సద్వినియోగపరచుకోండి అన్నట్లు అవకాశాన్ని కల్పించుటకై ఈ జన్మలోని శరీరాన్ని లాక్కుంటాడు. ఇదంతయూ పరమాత్మ అనుగ్రహం కాక మరేమి?

"సర్వహర మృత్యువు" అనేది భగవంతుని అపారమైన కృప. అయినా మనకది భయంకరంగా కానవస్తోంది. ఎందుకంటే మనకు ఈ శరీరం, దీనికి సంబంధించిన భార్యా బిడ్డలు బంధుమిత్రాదులు, ధన కనక వస్తువాహనాలు, ఆస్తిపాస్తులు, అధికారం, కీర్తి ప్రతిష్ఠలు - ఇత్యాదుల అభిమానం మితిమీరియుంటుంది. ఈ అభిమాన ఫలితంగా మనం ఎంత దుఃఖాన్ని అనుభవిస్తున్నా మనం ఈ సన్నివేశాన్ని వదలిపోవుటకు సిద్ధంగా లేము. దయాళువైన భగవంతుడు తన విభూతియైన మృత్యువు ద్వారా మనలను ఈ సంకటం నుండి తప్పించి మరొక జన్మను ప్రసాదిస్తాడు. ఎన్ని కోట్ల జన్మలెత్తినా మనం మన తప్పును సరిదిద్దుకోక పోవచ్చు. భరింపరాని దుఃఖాన్ని అనుభవింపవచ్చు. అయినా భగవంతుని కృప మనపై అపారమై వున్నందున మనకు మరీమరీ తిద్దుకొనే అవకాశం ఇస్తూనే ఉ

ంటాడు. మనమంతా అతని కృపాచ్ఛత్రం నీడ క్రిందే వున్నాం. ప్రళయంలో కూడా మమ్మల్ని తన పొట్టలోనే పెట్టుకుని కాపాడి మరల కల్పాంతరంలో శరీరేంద్రియాదులను ప్రసాదించి అనుగ్రహిస్తాడు ! ఇలాంటి కరుణాసాగరుడు పరమాత్మ!

ఈ దృష్టితో పరిశీలిస్తే మనం మృత్యువును స్వాగతం చెప్పాలి. మృత్యువనేది మనచే ఒక విధమైన తపస్సు చేయించి, నిరుపయోగమైన పాతశరీరాన్ని విడిపించి నూతన శరీరాన్ని ప్రసాదించే ద్వారమైయున్నది. ఈ జన్మలో జననం, రోగం, ముసలితనం, చావు - ఇవన్నీ కష్టాలే అనిపించినా, వీటిని ధైర్యంతో సహించే మనఃస్థితిని సంపాదించుకొనాలి. ఈ జన్మకు నవ్వుతూ రావాలి. ఇచట నవ్వుతూ ఉండాలి. కడాకు నవ్వుతూ పోవాలి. మృత్యువుకు స్వాగతం పలకాలి. అంతేకాదు, దాన్ని పూజించాలి, భగవత్స్వరూపమని తెలియాలి. మనం మరణ సమయంలో "ఈ జన్మలో తప్పు చేసి జనవ్యర్థం చేసుకొన్నాము. ముందు జన్మలోనైనా సద్బుద్ధి నిమ్మని పరమాత్ముని వేడుకొనాలి. ఈ విధంగా మనం మృత్యువును భగవద్విభూతి అని భావించి గౌరవించాలి.

## 8. గాయత్రీ ఛన్దసామహమ్

ఛందస్సులో గాయత్రి నేను. ఈ కలియుగంలో గాయత్రిని అనుసరిస్తే ద్విజశ్రేష్ఠులవుతారు. వేదంలో గాయత్రికి గొప్ప స్థానం ఉంది. గాయత్రి కంటే గొప్ప మంత్రం లేదని పురాణంలో చెప్పబడింది. ఈ మంత్రాన్ని విశ్వామిత్ర మహర్షి కనిపెట్టాడు. దీనికి పరమాత్మయే దైవం. ఎవరు దీన్ని శ్రద్ధతో ఉచ్చరిస్తారో వారిని కాపాడుతుంది. అందువల్ల గాయత్రీ అనే పేరు సార్థకం. గాయత్రి మంత్రోపదేం తదనంతరమే వేదాధ్యయనం ప్రారంభించాలి. ఈ కాలంలో గాయత్రి మర్మ తెలియని వారే ఎక్కువ. ఇది శోచనీయం!

గాయత్రి అర్థమేమి? జగత్కారణమైన పరమాత్ముని తేజస్సును మనం

ధ్యానించాలి. అతడే మన బుద్ధిని ప్రేరేపింపజేసేవాడు. భగవదనుగ్రహంచే మన బుద్ధి సన్మార్గం వైపు తిరగాలి. ఈ కాలంలో దేవుడనేవాడు లేడనియే భావించుకొని మనం వ్యవహారం చేస్తున్నాం. మనమంతా కామక్రోధాదులకు వశులై పరమాత్మునికే సున్న చుట్టినాం. దాని లమే మన ప్రస్తుత పరిస్థితి!

మనుష్యునికి యుక్తి మాత్రమే ఈశ్వరదత్తమైన సాధనం కాదు. భావన, సంకల్పం – ఇత్యాదులున్నాయి. ధర్మం, అధర్మం – మున్నగు వాటిని యుక్తిచే సాధించటానికి గాని ఖండించటానికి గాని సాధ్యపడదు. అందువల్ల శ్రద్ధతో గాయత్ర్యాదుల స్వరూపాన్ని తెలుసుకోవాలి. ఇపుడు ఈ దృష్టితో గాయత్రి అర్థాన్ని పరిశీలిద్దాం. "తత్సవితుః" అనే శబ్దానికి అర్థమేమి? సవితృ అంటే జగత్కారణమైన పరమేశ్వరుడు 'సవితుః' అనే మాటను ఉచ్చరించేటపుడు సమస్త జగత్తు – వేదాన్ని ధర్మాధర్మాల్ని వాటి ఫలితాల్ని సృష్టించిన పరమేశ్వరుడొకడున్నాడనే భావన హృదయంలో స్ఫురించాలి. మనం చేసే కర్మలకు ప్రేరకుడూ ధర్మాధర్మాలకు పలమునిచ్చే దాత ఒకడున్నాడని మనఃపూర్వకంగా నమ్మికోవాలి. పరమేశ్వరుడు సర్వత్రా వ్యాపించుకునియున్నాడు. అయితే మనంవ్యవహారంలోనే మునిగియున్నందున పరమాత్మ ప్రకాశాన్ని అలక్ష్యం చేసినాం. మనకు వ్యవహారమందునూ వ్యావహారిక వస్తువులయందునూ పూర్ణ విశ్వాసముంది. మనం పరమేశ్వరునికి విముకులై ఉండడం వల్ల అతని ప్రకాశం మనకు తెలియడం లేదు. దాన్ని యుక్తిచే తెలియడానికి సాధ్యపడదు. ఎందుకంటే అది యుక్తి క్షేత్రానికి చేరింది కాదు. అందువల్ల మనం భావంతో నమ్ముకుని గాయత్రిని జపించాలి. తదనంతరం దాని అర్థం మన హృదయంలో స్ఫురిస్తుంది.

ఇంక ఈ గాయత్రి యొక్క రెండవ వాక్యం పరిశీలిద్దాం. ఈ దేవుని ధ్యానిస్తే అతడు మన బుద్ధుల్ని ప్రేరేపిస్తాడు. మనకు మంచి బుద్ధి ప్రసాదిస్తాడు.

ఇపుడు మనకు దుర్బుద్ధి పెరిగింది. ఈ బుద్ధి పెరిగినట్లెల్లా జనులకు పిచ్చి సోకుతుంది. ఇది పిచ్చోళ్ళకాలం కాన, కామక్రోధలోభాల పిచ్చి జనుల్లో ప్రబలమైంది కామక్రోధలోభాలనేవి నరకానికి ద్వారాలని గీత చెప్పింది. మనకు సద్గతి లభించే బుద్ధినిచ్చి ప్రేరేపించువాడు భగవంతుడు. పరమాత్మసద్రూపుడు, జగత్కారణుడు, సర్వవ్యాపకుడు, సద్బుద్ధి ప్రేరకుడు –అనేదంతయూ గాయత్రిలో అంతర్గతమైయున్నది. ఈ మంత్రాన్ని మనం ఉచ్చరింపకున్నా పర్వాలేదు. సద్బుద్ధి నివ్వమని దయామయుడైన భగవంతుణ్ణి హృదయపూర్వకముగా వేడుకుంటే చాలు. ప్రళయాంతకమైన మన బుద్ధి సద్బుద్ధియై పరిణమిస్తోంది. మనకు లోకానికీ శుభంచేకూరుతుంది. ఇదే గాయత్రీ సారం.

## 9. మౌనం చైవాస్మి గుహ్యానాం

రహస్యాల్లో మౌనం నేను. మౌనం అధ్యాత్మికం, మనల్లో గుప్తంగా ఉంది. ఆధ్యాత్మికం, ఆధిభౌతికం, ఆధిదైవికం – ఈ త్రివిధ ప్రపంచాల్లో భగవంతుని విభూతులున్నాయి. మౌనం ఎలా రహస్యమౌతుంది? అంటే ఇచట మౌనమనగా కేవలం వాక్మౌనాన్ని చెప్పడం లేదు. ఇది మనస్సుకూ సంబంధించింది. రహస్యమంటే సులభంగా తెలియడానికి వీలుకానిది. తత్త్వం అలాంటి స్వభావం కలది. అనుభవజ్ఞులు ఉపదేశించినప్పటికీ జనులు తెలుసుకోలేరు. రహస్యమనగా చెప్పకూడదని అర్థం కాదు. అనధికారులకు తత్త్వాన్ని బోధించరాదని పెద్దలు చెబుతారు. ఎందుకంటే దాన్ని తెలియక పోయినా పొరపాటుగా తెలుసుకొని వ్యవహారంలో ఉపయోగించడం వల్ల అపాయం సంభవించే ప్రమాదముంది.

ఇంకో దృష్టితో రహస్యమంటే మరొకరితో చెప్పరాని సాధనాలు. ధర్మః క్షరతి కీర్తనాత్' తాను చేసిన ధర్మాన్ని అలాచేస్తిని, ఇలా చేస్తినని

దంభం చెప్పుకోవడం వల్ల ధర్మమే నాశమవుతుందని స్మృతికారులు చెబుతారు. అందువల్ల ధర్మమును, తాను చేయుచున్న ఉపాసనాది సాధనాలను సంత బజారులో పొగడుకోవడం సరికాదు. ఈ అర్థంలో అది రహస్యం. గురువు చెప్పిన మంత్రమూ పరమాత్మని ధ్యానాది సాధనమూ ఈ అర్థంలో రహస్యం. దాన్ని తన హృదయంలో దాచుకొని సాధించడం వల్ల దానికి బలం చేకూరుతుంది.

ఇలాంటి రహస్యాల్లో గొప్ప రహస్యం మౌనం. మౌనమంటే ఏమి? దేనిచే మానవుడు ముని అనిపించుకుంటాడో అది మౌనం.

“మౌనాన్న స మునిర్భవతి నారణ్య వసనా న్మునిః। స్వలణం తు యోవేద సముని శ్రేష్ఠ ఉచ్యతే ॥” పలకకుండా వుంటె ముని కానేరడు. అరణ్యంలో నివాసం ఏర్పరచుకున్నంత మాత్రాన ముని కానేరడు. ఎవనికి ఆత్మస్వభావం తెలిసిందోఅతడే మునిశ్రేష్ఠుడని భారత వచనం. పరమాత్మ తత్త్వాన్ని మననం చేయడమే మౌనం. మనోవృత్తులన్నింటిని నిగ్రహించి అంతర్ముఖుడై బుద్ధికి ఆవల నుండు పరమాత్మయందు నిలిచిపోవడమే అన్నిటికన్నా గొప్పమౌనం “మనోదృశ్యమిదం ద్వైతం” అంటే మనోకల్పన వ్యాపారమే వ్యవహారమనబడుతోంది. ఈ మనోవ్యవహారానికతీతం కావడమే మౌనం. శాస్త్రశ్రవణం చేసి సందేహాలన్నీ తొలగించుకోవడం పాండిత్యం. తదనంతరం బ్రహ్మవిద్యబలంచే పిల్లల్లా బాహ్యజ్ఞానాన్ని ఉపేక్షించి, తాను ఇలాంటి వాడని మరొకరితో ప్రకటించుకోక ఉండడమే బాల్యం.తర్వాత అనాత్మ చింతను సంపూర్ణంగా వీడి పరమాత్మ చింతన యందే మునిగిపోవడం మౌనం. ఇలా నిత్యమైన బ్రహ్మమందే నిల్చినవాడే నిజమైన బ్రాహ్మణుడు. ఈ మౌనం నేనని భగవంతుడు చెప్పాడు. మౌనమనేదొక పరమాత్ముని మహావిభూతి. ఎందుకన పరమాత్మణ్ణి మౌనం చేతనే ఉపదేశించటానికి

యోగ్యుడు. దక్షిణామూర్తి పరబ్రహ్మ తత్త్వాన్ని మౌన వ్యాఖ్యానం చేతనే బోధించినట్లు శ్రుతి చెబుతోంది. ఈ మౌన తత్త్వం యొక్క విలువ కనుక్కోవడం చాలా కష్టం.

ఉపసంహారం

నా దివ్యమైన విభూతులకు అంతం లేదు. దేనిదేని యందు వైభవముంటుందో, ఉత్సాహ శక్తి కానవస్తుందో వాటన్నిటినీ నా తేజస్సు యొక్క అంశం వల్ల ఉత్పన్నమైనదని తెలుసుకో. మహనీయులకు అలాంటి వస్తువుల దర్శనం వల్ల భావసమాధియే సిద్ధిస్తోంది. ఇలాంటి దృశ్యాల్ని చూచినపుడు భగవంతుని స్మరించుకోవాలి. ఈ జగత్తు ఇపుడే ఇచటనే పరమాత్మమయమై ఉంది. అయితే మన భావన దాన్ని తెలుసుకుని ఆనందించే స్థితిలో లేదు. భగవద్భక్తులు మాత్రం ఎపుడునూ పరమాత్మనే దర్శిస్తూ అతన్నే ధ్యానిస్తూంటారు. వారి దృష్టిలో పరమాత్మను వీడి ప్రపంచమనేదే లేదు. అందువల్ల ఈ సమస్త బ్రహ్మాండమే భగవంతుని విభూతి అని తెలియాలి.